యుండెను. ఎక్కువైనుకాంచి డీరు షైనిపడుచున్న, టీలుకానునదును రైలు మార్గములను శత్రువు నిర్మించియుండెను. అపారమైన యుద్ధసామగ్రిని శత్రువు తెచ్చియుంచెను. వీనిని బట్టి శత్రువు గాజా మొదలుకొని, బీర్షాబావఱకునుగల తన సేనాముఖమును గట్టిపరచుకొనెనని వ్యక్తమగుచున్నది. అట్టిసందర్భములందాంగ్లులు అక్టోబరు 31 వ తేదిని ముట్టడిని ప్రారంభించి ఈ గ్రామమునందియు దక్షిణము నుండియు బీర్షాబాను వశపరచుకొని పశ్చిమప్రాంతమునందలి షేరియా, హీరారా వైపునకు సైనికులు వెళ్లిన కొలంది గాజాముఖము రక్షణయోగ్యము గాక దానిని శత్రువులు త్యజింపవలసివచ్చెను. గాజా ముఖము ఆంగ్లులకు వశమైన వెనుకను శత్రుసేనలు చెల్లాచెదరుగ ఒక పార్శ్వము సముద్రప్రాంతమునుండియు మరియొక పార్శ్వము తూర్పు ముఖముగను పలాయనమైనవి. యుద్ధమారంభమైన 15 దినములకు ఆంగ్లులు తమ తూర్పుభాగమునందు 50 మైళ్లదూరమును, ఎడమ భాగమునందు 40 మైళ్ల దూరమును ముందునకు వెళ్లగలిగిరి. శత్రు సేనలు చెల్లాచెదరై పోయిన పిమ్మట జాఫా, లుడ్డు, రామ్లే పట్టణములను ఆంగ్లులు సులభముగ పట్టుకొనిరి. తూర్పుప్రాంతమునకు పలాయనమైన శత్రుసేనలు జరూసలేము వైపునందు గల కొండలను శరణ్యము చేసికొనియుండెను. ఈ త్రిగాక్షిముఖముగ పారిపోయిన సేనలకును జరూసలేము వైపునకు పోయిన సేనలకును సంయోగము కలిగి శత్రువు నిలద్రొక్కుకొనుటకు జరగాకపోయినను త్యజించి టుల్-కెరాము నాబులసుముఖమును చేరినప్పుడు వీలు కలుగును. సముద్రప్రాంతము నుండి ఆంగ్లులు యుద్ధసామగ్రిని ముగ్నకు వానిని సేనాముఖమునకు చేర్చవలసియుండెను. రైలుమార్గములను త్వరితముగ వేయవలసి యుండెను. క్రొత్త ప్రస్థానమునకు తగినసన్నాహములు జరుగువఱకును యుద్ధమునందు కొంతవిలంబ మేర్పడుట వశ్యమైయుండెను. జాఫా జరూసలేములకు రామ్లేమీదుగ నొక రోడ్డుమార్గము కలదు. రామ్లేనుండి బయలుదేఱిన సేనలకు అన్నాబేబాటిన వెనుక ఆంగ్లసేన నడచుటకు అవాంతరములు కలిగెను. అన్లే ముందునకు జారిచేసికొని ఒక దళము కర్యటువైపునకును రెండవదళము ఉత్తరమునుండి బీరా వైపునకును వచ్చినవి. అప్పటికి నబ్లసు జరూసలేముమార్గమును ఆంగ్లులు సమీపించి సైనికులు వచ్చి పడియుండిరి. జరూసలేము చుట్టును శత్రువులు నిర్మించిన రక్షణసాధనము లొకటి తరువాత నొకటి విజేతలకు స్వాధీనమగుచుండెను. అక్కడి శత్రుసేనలు తమస్థానములను కాపాడుకొనుటకు వీలులేక జరూసలేమును త్యజించి మరలిపోయినవి. డిసెంబరు 11 వ తేదిని ఆంగ్లులాపట్టణమునందు ప్రవేశించిరి అక్టోబరునుండియు జరిగిన యుద్ధమునందు 12 వేల మంది తురుష్క సైనికులు విజేతలకు వశమైరి; బోలెడు మందుసామగ్రియు వశమై యుండెను. జోర్డను నదీప్రాంతమును దాటిపోయిన ఆంగ్లసైనికులకు కొంతనిరోధము కలిగి ఇస్-సాల్టుపట్టణమును త్యజించిరి. అందువలనను జోర్డను నదీప్రాంతమునందలి సేనలలో చాలభాగమును ఆంగ్లులు వెనుకకు మరలించియున్నను నదీ తూర్పుభాగము వారి స్వాధీనమునందే కలదు. జోర్డను తూర్పుభాగమునందు తీవ్రయుద్ధము జరుగుచుండెను. ఆంగ్లులు జోర్డనునది తూర్పుభాగమునకు రెండుపర్యాయములు వెళ్లిరి. రెండుసారులును వెనుకకు మరలవలసివచ్చినది. అంతకంటెను ఆ ప్రాంతమునందలి యుద్ధసమాచారము తెలియుటలేదు.

## మెసపొటేమియా రంగము

మెసపొటేమియా రంగమునందు బాగ్దాదుపట్టణము ఆంగ్లులకు వశమైన వెనుకను ఇవ్ఫ్రటీసు నదీప్రాంతమునందు వారికి విజయము కలిగినది. ఇవ్ఫ్రటీసునది దిగువభాగమునుండి తురుష్కులు పలాయితులైరి. బాగ్దాదుపట్టణమున ఉత్తరభాగమునందలి కిలాబాపట్టణము నుండి ఆంగ్లసేనలు ముందునకుపోగా మసూలుపట్టణమును ముట్టడించి దానిని పట్టుకొనినవి. అక్కడ అహమదు బే నాయకత్వము క్రింగను యుద్ధము చేయుచుండిన తురుష్కసేన యంతయు ఆంగ్లులకు వశమైనది. దానవ్రై కిలాబాపట్టణమునకు పశ్చిమముగ 30, 40 మైళ్ల దూరమునందు కలదు. తరువాతను డెల్లీవా, కభలు, గోబతు ప్రాంతములందు గూడ యుద్ధము జరిగి డైల్లాపట్టణమును ఆంగ్లులు వశపఱచుకొనిరి. నబారిన్న, డైల్లానదుల మధ్యను గల ప్రదేశమునందు ఆంగ్లుల పురోగమనము నాపుటకు తురుష్కులు చేసిన ప్రయత్నములు కార్యకారిగాలేదు. పారసీక పర్వతప్రాంతమునుండి తురుష్కసేనలను ఆంగ్లులు తఱిమివేసియుండిరి అక్కడనుండి ఆంగ్లులకు పురోగమనము కలిగి కిఫ్రి, ఎయిమసారిను, తాసుమకుప్రి పట్టణములు వారికి స్వాధీనమైనవి.

## ఇతరరంగములు

ఇతరరంగములందు బాల్కనునందు ప్రగలనము కలిగియుండలేదు. రుమేనియా నుష్యాంగములకు సన్నికటసంబంధ ముండుటయు, రుష్యనులు ప్రత్యేకసంధి చేసికొనుటవలన రుమేనియారంగము దుర్బల మగుటయు నందువలన రుమేనియనులు ప్రత్యేకసంధికి ఒప్పుకొని యుద్ధమును విరమింపవలసి వచ్చినది.

# 1918 వ ప్రస్థానము

## జర్మనుల యువస్కంధనము

1918-వ సంవత్సరమునందు జర్మనులు విజయమును గాంచుటకు భగీరథప్రయత్నములను చేసితీరుదు రనియు ఆ కాలమునందు మిత్రమండలి కాలావలంబనము చేసి రక్షణతంత్రము నవలంబించి శత్రుబలముడిగిన వెనుక వారి నోడింప వనియు యుద్ధచారిత్రమునకు ప్రారంభమునందు వ్రాసియుంటిమి. శత్రు విప్లవరణరంగమునందు తన సర్వస్వము నొడ్డుచున్నాడు. మార్చి 21-వ తేది గురువారమునాడు జర్మనులు పశ్చిమరంగమునందలి ఆంగ్లపరాసుల కూడలిస్థానమునందు దారుణసంగ్రామము నారంభించిరి. ఆయుద్ధమువలన జర్మనులు ఆంగ్ల పరాసు సేనలను వేఱుపఱచి తమ కనుకూలమైనట్లొకరి వెనుక నొకరిని విడివిడిగ సంహరింపుటకు సంకల్పించిరి. యుద్ధారంభమునుండియు జర్మనుల కాంగ్లసేనలే గర్భశత్రువుగనుండి వారికి విజయమును దూరము చేయుచున్నవి. పరాసు సేనలనుండి ఆంగ్లసేనను వేఱుపఱచి, దానిని సంహరించుటయే జర్మను సేనానుల యుద్దేశ మని కొందఱు చెప్పుదురు. ఎమీన్సు పట్టణమును వశపఱచుకొని సోమనదీప్రాంతమునుండి పారిసుపట్టణమును జర్మనులు వశపఱచుకొన దలచియుందు రని కొందఱు చెప్పుదురు. జర్మనుల ప్రథమసంకల్ప మీ రెంటిలో నేదియైనను తరువాత జర్మనులు ఆర్మెంటీసుయొద్ద కూడ ముట్టడించుటచే వారికి రెండు సంకల్పములు గూడ కలిగె ననియును, ఆరంభమునందు పరాసు సేనలు ఆంగ్లులకు సాహాయ్యము చేయుటకు వీలులేకుండ వేఱుపఱచి, తరువాత ఆంగ్లముఖమును భేదించి వైప్రెసు ముఖమునందలి సేనలను సముద్రము వైపునకు తఱిమివేసి సోముముఖమునందలి సేనలను సంహరించి జర్మనులు పారిసుపట్టణముమీదకు విజయయాత్ర కుపక్రమింప దలచియుందురని యూహించుటకు వీలు కలుగుచున్నది. ఎమీన్సు ప్రస్థానమునకును, ఆర్మెంటీసు ప్రస్థానమునకును ఏకకాలమునందే

జర్మనులు సన్నాహములు చేసియుండవచ్చును. వారి సైనికపంక్తి వెనుకను దివ్యమైన గమనాగమనసాధనము లుండుటచే వారట్లు చేయుటకు వీలు కలదా లేదా యను సందియమున కాధారము లేదు. జర్మనుల ప్రకృతపు ప్రస్థానతంత్రము నాలోచించినకొలదిని వారు పడమటిరంగమునందు విజయము గాంచుటకు కొన్ని యెత్తులైన నెత్తి మిత్రమండలి సేనలను కందకములనుండి కదలించి బహిఃప్రదేశము నందు వ్యూహపరంపరలను పన్ని తమ సైన్యపు టాధిక్యమును గనబఱచి యేలాగు నైనను యుద్ధమునందు జయాపజయములను నిర్ణయించుటకు కృతనిశ్చయులై యున్నారని తోపకమానదు. తత్ఫలప్రాప్తికై వారు ఆరంభమునందు ఆంగ్ల ఫరాసు సేనల సంయోగమును భేదించి తరువాతను ఆంగ్లముఖమును రెండు భాగములుగ చేసి ఒకటి తరువాత నొకదాని నోడించి చివరకు ఫరాసుల పని పట్టినయెడల సులభముగ సంధిచేసికొనుట వీలు కలుగునని దలచియుందురు. కాని జర్మనుల ప్రయత్నము లింతవఱకును కార్యకారి కాలేదు; ముందట్లు జరుగునని యూహించుటకు వీలులేదు. జర్మనుల రణతంత్రమువలన కలుగు విషమస్థితిని మిత్రమండలి సేనాధ్యక్షులు గ్రహించి దానికి ప్రతిక్రియ చేయుటకు పోలేదు. ఇంతవఱకును యుద్ధస్వరూపమునందు నూతనదశ యేర్పడి యుండలేదు; దినదినముఖమునందు శత్రుసేనలను కందకములనుండి కదలించి వానిని భేదించి వ్యూహజాలమునందు వానిని చిక్కించి యోడించిన గాని జర్మనులకు యుద్ధమునందు విజయము కలుగనేరదు; యుద్ధమింకను మాములు ప్రస్థానదశయందే కలదు, జర్మను లింకను ఆ స్థానమునకీ స్థానమునకును పెనగులాడుచునే యున్నారు. కాని జర్మనులు తమ సంకల్పమును మానుకొనిరని తలచుటకు వీలులేదు. వారి ప్రస్థానమునకు ప్రస్తుతకు మధ్యాంతరము కలిగినను మనము నమ్మవలయును. జర్మనులకు సేన లుండినంతవఱకును వారు తమ సంకల్పమును మానరు. జర్మనులసంకల్పమునకు వారికెట్లు కలిగినను యుద్ధప్రస్థానమును దిలకించి నప్పుడు స్పష్టము కాగలదు. వారు మార్చి 21వ తేదిని 50 మైళ్ల ముఖమునందు స్కార్పు సొమ్మె నదులమధ్యను కాంబ్రెయి ప్రదేశము నందు అవస్కందనమును ప్రారంభించి మిత్రమండలి సేనాముఖమును భేదించి మాంటిడిడరు పట్టణమువఱకును వచ్చిరి. అంతటితో వారి పురోగమన మాగిపోయినది. మాంటిడిడరునకును ఫరాసుల రాజధానీ నగరమునకును 60 మైళ్లదూరము కలదు. ఆయిసు లోయనుండి ఫరాసుల రాజధానీనగరమునకు సులభమైనమార్గము కలదని జర్మనుల విశ్వాసము. లాఫెరిపట్టణము మొదలు క్రోయిసెలు పట్టణమువఱకును జర్మనులు అగ్నివర్షమును రెండుగంటలు కురిపించి పదాతిసేనను ముందునకు పంపిరి. జర్మను పదాతి సేన శుక్రవారము సెయింటు క్వెంటినునకు పడమటను ఆంగ్ల సైనికుల రక్షణస్థానములను భేదించుటవలన ఆంగ్లులు వెనుకకు మరలవలసివచ్చినది. శనివారము శత్రువులు పెరోనుపట్టణమునకు తూర్పుభాగమునందు టోర్టెలునదిని దాటి ముందునకు వచ్చి తరువాతను సోమునదిని కూడ దాటియుండిరి. సోమవారము నాడు వారు అల్బర్టుబాపూము మార్గమున కిరుపార్శ్వములందును గల మార్టిన్ పుచ్, కౌర్సెలెటు గ్రామములను వశపఱచుకొనుటవలన మిత్రమండలి సేనలు అల్బర్టును త్యజించి దాని వెనుకను గల ప్రదేశముల నాక్రమించుకొనవలసివచ్చెను. ఫరాసుముఖమునందు శత్రువు రోయి-బ్రెటూలు మార్గమున నవస్కందనమును ప్రారంభించి ఫరాసులను 8 మైళ్ల దూరము వెనుకకు త్రోసియుండెను. అందువలనను జర్మనులు మాంటిడిడరు పట్టణమును పట్టుకొనగలిగిరి. జర్మనుల కీ యుద్ధమునందు ఆంగ్లముఖమునందు మేజీర్సు మొదలు మోరులువఱకును వ్యాప్తమైన ప్రాంతమును మాంటిడిడరువఱకును ఫరాసు ముఖమునందలి ప్రాంతమును స్వాధీనమైనది. కాని అర్రాసునొద్దను, దానికి దక్షిణమునందును శత్రువున కింతమాత్రమును పురోగమనము కలిగియుండలేదు. అర్రాసు ముఖమునందు జర్మనులకు పురోగమనము కలిగియుండక పోవుటచే ఉత్తరమునందలి (వైప్రెసుముఖము) ఆంగ్లసేనను మరలించుటకు వీలు కలుగలేదు. అర్రాసును నొమ్మిచేసి పట్టుకొనుటకు జర్మనులకు సాధ్యమై యుండలేదు. కావున అర్రాసునకు ఉత్తరమునందు ముట్టడించి ముందునకు రాగలిగినయెడల యుద్ధముచేయ నక్కఱలేకయుండ స్వల్పనష్టముతో నక్కడి ఆంగ్లసేనాపంక్తిని మరలించుటకు వీలు కలుగునను నుద్దేశముతో జర్మనులు లెన్సుపట్టణమున కుత్తరము నందు లాబాసీ కాలువ మొదలు వైప్రెసుపట్టణమునకు దక్షిణమునందు గల హొల్బెకుపట్టణమువఱకును ఏప్రిలునందు అవస్కందనము ప్రారంభించి ఆర్మెంటీర్సు ప్రాంతమును సంరక్షించుచుండిన పోర్చుగీసు సేనను ప్రబలసైన్యముతో లోంగదీసి దాని కిరుపార్శ్వములందును గల ఆంగ్ల సైనికపంక్తి వెనుకకు మరలునట్లు చేసిరి. అక్కడ శత్రువులు మెర్విలువఱకును ముందునకు వెళ్ళిరి. మెర్విలుపట్టణమునుండి జర్మను సేనాభుజము ఉత్తరమునందు మెస్సీన్సువఱకును, దక్షిణభాగమునందు గివెంషివఱకును వ్యాప్తమైయున్నది. తరువాత జర్మనులకు బైలూలు, కెమ్మెలు పట్టణములు స్వాధీనమైనవి. గివెంషికి ఉత్తరమునందు బెతూనుపట్టణము కలదు. యుద్ధమాపట్టణమునకు వ్యాపించి శత్రువునకు దక్షిణమునందు పురోగమనము కలిగినయెడల లెన్సు అర్రాసుముఖమునందలి సేనాపంక్తి వెనుకకు మరలవలసివచ్చునని యుద్ధపటమును దిలకించువారలకు గోచరము కాగలదు. కావున బెతూనుపట్టణపు రక్షణము మిత్రమండలి సేనల కత్యవసరము. కాని ప్రస్తుతమునం దాప్రాంతమునందు యుద్ధము జరుగుటలేదు. అంతటితో పడమటిరంగమునందలి మార్చి ఏప్రిలు యుద్ధప్రస్థానమునకు విలంబము కలిగినది. ముందు జర్మను లుపక్రమించు ప్రస్థానస్వరూపము నెట్టిదని నిర్ణయించుటకు వీలులేకున్నను మార్చి ఏప్రిలులందు జరిగిన యుద్ధస్వభావమునుబట్టి ముందు జరుగు యుద్ధస్వరూపమును కొంతవఱకు గ్రహింపవచ్చును. వారు మాంటిడిడరు ప్రాంతమునందును, మెర్విలు ప్రాంతమునందును ముందేక కాలమునందు అవస్కందనము ప్రారంభించి తమ కప్పుడు కలుగు లాభాలాభములనుబట్టి యేదో యొక వైపునందు విజృంభించుట కాలోచింపవచ్చును. ఇంతకంటె ప్రస్తుతదశయందు జర్మను ప్రస్థానతంత్రమును గ్రహించుటకు వీలు లేదు.

## మిత్రమండలి రణతంత్రము

శత్రుభంజనమునకు 20, 30 లక్షల నూతనసేన కావలసియున్నది. ఆ భారమును అమెరికావారు వహించుచున్నారు. అమెరికా సేనలు శత్రువును బారదరుము జర్మనులకు విజయము కలుగకుండ మిత్రమండలివారు ప్రతిఘటించెదరు. అమెరికా సేన లిదివఱకే కొంతవఱకును రణరంగమును ప్రవేశించినవి; తక్కిన సేనలు త్వరితముగ ప్రవేశింపగలవు. కాలవిలంబనముకొఱకు పోరాడుచున్న మిత్రమండలి యుద్ధావసరమునుబట్టి కొంత ప్రదేశమును త్యజింపవలసి వచ్చినను సేనాముఖము చెక్కుచెదరకుండ నుండువఱకును భయపడ నవసరముండదు. మాంటిడిడరు ప్రాంతమునందు ఆంగ్లఫరాసు సేనలకు క్షణకాలము వియోగము కలిగినప్పుడు ఆంగ్ల ఫరాసు సేనాధ్యక్షు లవలంబించియుండిన యుత్తమమార్గమువలన తిరిగి వారి సేనాముఖము కమ్ముకొని శత్రువు ఎత్తు భంగమై పోయినట్లే ముందును అట్టి యుత్తమమార్గమే ప్రబలి మిత్రమండలికి విజయదశ యేర్పడగలదు.

యుద్ధములో జర్మనుల నోడించి కీర్తిప్రముఖుడాయెను. ఇప్పు డీయన లండను లో యుద్ధమంత్రి కూటములో నొక్కడుగా నుండి పనిచేయుచు గొప్పగొప్ప యుపన్యాసము లప్పుడప్పు డొసంగుచుండును.

సర్ ఎడ్వర్డు మారిస్ న్యూఫౌండ్‌లాండు ముఖ్యమంత్రి, సర్ జోసెఫ్ వార్డు న్యూజిలాండు ముఖ్యమంత్రి, వాల్టరు లాంగు అధినివేశములన్నింటిపయినను లండనులో నుండు బ్రిటిషు చక్రవర్తిగారి మంత్రి.

ఆస్టిన్ ఛేంబర్లేను గారు ఇండియా స్టేటు సెక్రటరీగా నుండిరి. డబ్లు మాసీ గారు న్యూజిలాండు మంత్రులలో నొకరు. బెత్మన్ హాల్వెగ్గు గారు జర్మనీకి ప్రధాన మంత్రిత్వమును జేసెను. రాబర్టు లాన్సింగు గారు అమెరికా సంయుక్తరాష్ట్రములకు విదేశ కార్యదర్శి. జోసెఫ్ డానియల్సు, న్యూటను బేకరు గార్లు అమెరికా మంత్రులు. జరార్డుగారు జర్మనీలో యుద్ధకాలమందున్న అమెరికా రాయబారి.

రష్యా విప్లవనాయకులు:—జారుగారిని నిర్బంధితుని చేసిన సేనాధిపతి. బోదియాటిన్, షింగరేఫ్, జనరలు బ్రుసిలోఫ్, మిల్యుకోఫ్—వీరందరును రష్యా చక్రవర్తిని పదభ్రష్టుని చేసిన ముఖ్యులలో కొందఱు.

ఎం. రాడ్జియాంకో:—ఈయన రష్యాపార్లమెంటుకు అధ్యక్షుడుగా నుండి రష్యా చక్రవర్తిని పదభ్రష్టునిగాజేసిన దినములలో ఆయనతో రాయబారములు జరిపిన ప్రజాప్రతినిధి; అతి దేశాభిమాని; ప్రజాహితవాది.

రాస్పుటిన్:—ఇతను ఐంద్రజాలికుడు. రష్యా చక్రవర్తిని చక్రవర్తినిని తనచేతిలో గొందుకొని కీలుబొమ్మలవలె వారి నాడించెను. జర్మనుల పక్షమున నుండి సంధికయి బహువిధముల యత్నించెను. వీనిదుర్మార్గములను సహింపజాలక రష్యా రాజసంతతిలోని యొక గుమాస్తా యింటికి పిలిచి కాల్చి చంపించి నదిలో పడవేయించిరి. వీడు పోయిన కొన్ని మాసములకు రష్యారాజు సింహాసనమును గోల్పోయెను.

మేడం బ్రెష్కోవ్స్కి:—సైబీరియాకు జారుగారి ప్రభుత్వముక్రింద బహిష్కరింపబడిన యువతులలో నొక్కతె. అతి దేశాభిమానురాలు. ఇట్టి యువతీమణులు దేశభక్తితో పడిన కష్టములవలననే రష్యాకు విముక్తి కలిగినది.

మాన్సియర్ మార్టినో:—ఈయన ఫ్రెంచివారిలో శ్రేష్ఠుడగు జనరలు. గొప్పపండితుడు. దేశచరిత్రములందు పాండిత్య మెక్కువ. 1917-వ సం॥లో మదరాసు విశ్వవిద్యాలయపు విద్యార్థులు పట్టములను పుచ్చుకొను సమయమున వారికి హితబోధ చేసెను.

ప్రొఫెసరు ఎమ్. ఏ. కాన్టైర్ గారు, బి.ఏ., ఎల్. ఎల్. బి.:—వీరు గా. వీ. కే. రామస్వామయ్యరు గారి పుత్రులు. సర్ శంకరన్నాయరు గారి యల్లుడు. 1889 వ సం. జననము. 1909-వ సం. కేంబ్రిడ్జిలో బి. ఏ. పరీక్షయందు కృతార్థులైరి. 1914-వ సం. చెన్నరాజధానీకళాశాలయందు చారిత్రకపండితులుగా నియమింపబడిరి. వీరు హిందూదేశచరిత్రకారులలో మిక్కిలి ప్రఖ్యాతి గాంచిరి.

జె. సి. మొలోనీ, ఐ. సి. ఎస్.:—మదరాసు పుర పాలక సంఘమున అధ్యక్షుడు.

విక్టోరియా ధర్మపఠనమందిరము, గ్రంథాలయము; చెన్నపురి:—ఈ కార్యనిర్వాహక సంఘసభ్యుల పటములో నడుమ పుష్పమాలికాలంకృతులై కూర్చున్న కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు గారు సంఘాధ్యక్షులు. వారి కుడిప్రక్క కూర్చున్న కాళ్లకూరి గోపాలరావు పంతులు గారు గ్రంథాలయాధిపతులు; ఎడమ ప్రక్క కూర్చున్న గద్దె రంగయ్యనాయఁడు గారు వివారణకర్తలు. కుడిమొదకొనలందు కూర్చున్న రుద్రవరము వేంకటరావు, బి. ఏ., బొద్దులూరి పాటి గోపాలకృష్ణరావు గార్లు సహాకార్యదర్శులు. నిలుచున్న వారిలో కుడినుండి (1) గబ్బా రాధాకృష్ణశ్రేష్ఠి (2) పొలూరు కాశీవాస్తిశ్రేష్ఠి (3) కాకరపర్తి జగన్నాయకులు (4) గుడి గూతిము ఆదిరంగము (5) సామి రాధాకృష్ణయ్య గార్లు సంఘసభ్యులు. ఈ గ్రంథాలయపఠనమందిరములు బార్డిటపుకా హౌదాము త్తిమప్పుకా వీధి 'విద్యాలయ' భవనమందు 1917-వ సంవత్సరము ఫిబ్రవరి మాసమున స్థాపింపబడినవి. మునగాల రాజా గారు రావు సాహేబు కలువల కణ్ణన్ శ్రేష్ఠి గారు మున్నగువారు ఈ సంస్థాపనమునకు పోషకులు. ఈ ధర్మపఠనమందిరమునకు నెలొత్తముమీఁద ప్రతిదినము ఇంచుమించు 25 గురు వచ్చి చదువుకొనుచుందురు.

లోకమాన్యతిలకుగారి సందేశము:—(కూరుచున్న వారు, ఎడమప్రక్కనుండి కుడిప్రక్కకు)—(1) కస్తూరి రంగయ్యంగారు, హిందూ పత్రికాధిపతి, (2) లోకమాన్య అనిబిసెంటు, (3) లోకమాన్య తిలకు, (4) కరండీకరుగారు, (5) కేల్కరు గారు, కేసరీ మహారాష్ట్రపత్రికా సంపాదకుడు.

సామి వేంకటాచలము శ్రేష్ఠి గారు:—గుంటూరు జిల్లా ఒంగోలు తాలూకా అబ్బూరు గ్రామము వీరి స్వస్థలము. వీరు చెన్నపురియందలి సామి కృష్ణస్వామిశ్రేష్ఠి గారి స్వీకారపుత్రులు. ఆంధ్రాంగ్లేయభాషలందు మంచి వక్తలు. మాతృభాషాభిమానులు, సంఘసేవాపరాయణులు, ధర్మతత్పరులు, ఉదారస్వభావులు, కార్యశూరులు. ఐదవ జార్జి చక్రవర్తిగారి సందర్శనసభయందు ద్విభాషకభటనాయకులుగ పని చేసి ప్రశంసాపాత్రులైరి. ఆర్యవైశ్యమహాసభలోను దక్షిణహిందూదేశవైశ్యసంఘములోను కార్యదర్శులుగా పనిచేయుచున్నారు. ఇటీవల శ్రీకన్యకాపరమేశ్వరీ ధర్మస్థానమందొక ధర్మకర్తగా నెన్నుకొనఁబడుట వీరి స్వకులగణ్యతకును చెన్నపురాంధ్రసభా సహాకార్యదర్శిగ నెన్నుకొనఁబడుట వీరి యాంధ్రలోకగణ్యతకును ప్రత్యక్ష నిదర్శనములు. వీరు చెన్నపురాంధ్రసభా గ్రంథాలయోద్యమమున కొసంగిన వేయి రూప్యముల విరాళము వీరి దానధర్మములలో ప్రత్యేకించి ప్రశంసింపఁదగినది. వీరి యాచార్య మాంధ్రమాతృసేవాపరమై యత్యంతఫలవంత మగు ననుటకు సందియము లేదు.

కొని పెద్ద యెత్తున వ్యాపారము చేయుచున్నరు. వీరి పురుషాంతర ములో వీరును ప్రయోజకులుగ ప్రసిద్ధి నొందినారు. వీరు పూర్వాచారపరాయణులు, నిష్ఠాగరిష్ఠులు; వీరి సౌశీల్యము ప్రశంసాపాత్రము.

వాళము వేంకటరత్నము గారు:—వీరు లక్ష్మీకాంతము గారి యనుజులు, రసికాగ్రేసరులు, ఉదారస్వభావులు, భాషాభిమానులు, పరోపకారపరాయణులు.

పేరూరి విశ్వనాథము గారు:—వీరు జగ్గయ్యపేట వర్తకులు; బొంబాయిలోను చెన్నపురిలోను కూడ విరివిగ వ్యాపారమును నడిపిన సుప్రసిద్ధులు. ప్రస్తుతము చెన్నపురి వీరి స్థిరనివాసము. వీరికి స్వభాషాభిమానమును స్వదేశాభిమానమును మెండు. ఉదారస్వభావులును పరోపకారులు నగు వీరి సౌశీల్యము ప్రశంసనీయము.

పింగల సుబ్రహ్మణ్యము శ్రేష్ఠి గారు:— వీరు జేవాంగులు, వేటపాలెము వాస్తవ్యులు. ఇక్కడ పెక్కు కాలమునుండి లుంగీల వ్యాపారము చేయుచున్నారు. ఉదారులు, దానధర్మప్రియులు, సంఘసేవా పరాయణులు, ఆంధ్రోద్యమాభిమానులు, స్వభాషాప్రోత్సాహకులు. వీరు చెన్నపురాంధ్రసభ ప్రతిష్ఠాపకులలో నొకరు; ప్రారంభమునుండియు లలితకళాశాఖా కార్యదర్శిగ పనిచేయుచు సభాభివృద్ధికై పాటుపడుచున్నారు. ఈనడుమ చెన్నపురి యందు సమావేశమైన రాష్ట్రీయ బ్రాహ్మణేతర మహాసభాహ్వానసంఘమునకు సహాకార్యదర్శిగ నెన్నుకొనఁబడిన సుప్రసిద్ధులు.

శ్రీ వత్సవాయ వేంకటనరసింహము రాజు గారు:—సూర్యవంశ క్షత్రియులలో ప్రఖ్యాతి గాంచిన పెద్దాపుర సంస్థానాధీశులకు సమీప జ్ఞాతులును మా దేవస్థానంపల్లి వత్సవాయ కుటుంబమునకు మూలపురుషు లగు శ్రీ జగ్గరాజ భూపాలునికి మూడవ పురుషాంతరము వారును నగు వత్సవాయ సుబ్బరాజుగారికి వేంకటనరసింహ రాజు గారు రెండవ కుమారులు. వీరి తండ్రి గారి యద్వితీయ వితరణ శీలము సుప్రసిద్ధము. వీ రాయుర్వేదమునందును ఛాయాపట గ్రహణాది చిత్రకళలయందును విశేష నైపుణ్యము నొందినవారు. వీరికి వేటాడుటయం దతి ప్రీతి. ఆయుర్వేదమునందు విశేష నిపుణత నొంది మహాకష్టవులు మున్నగు ననివార్యరోగములను 9 దినములలో నివారింప గల యౌషధములను గనిపెట్టి సత్కీర్తి గడించిరి. వీరి మహారోగౌషధశాల చెన్నపురియందు జయప్రదముగ నిర్వహింపబడుచు, అసంఖ్యాకు లగు రోగుల నాకర్షించుచున్నది గాక! వీరు బీదల కుచితముగ చికిత్స చేయుటకై యొక ధర్మవైద్యాలయమును స్థాపించుటకు ప్రయత్నించుచుండుట ప్రశంసనీయము.

గద్దె పార్థసారథి శ్రేష్ఠి గారు :—చెన్నపురియందలి సుప్రసిద్ధవైశ్యకుటుంబములలో వీరి దొకటి. వీరు గొప్ప వర్తకులు, లౌకికవ్యవహారవేత్తలు, ఉదారస్వభావులు, స్వభాషాభిమానులు, దానధర్మప్రియులు. ఇటీవల శ్రీ కన్యకాపరమేశ్వరీ దేవస్థానమునకు ధర్మకర్తగా నెన్నుకొనఁబడినారు. వీరి సామర్థ్యసంపదౌదార్యములు సంఘసేవాపరములై వీరికి చిరకీర్తి సాధింపఁగల వని యూహింపఁబడుచున్నది.

గాయచోటి గిరిరావు పంతులు గారు:—వీరు చిత్తూరు మండలములోని మదనపల్లె వాస్తవ్యులు. గొప్ప విద్యాంగవేత్తలు, జాతీయవిశ్వవిద్యాలయమునకు ప్రధానాంగముగ నుండు బోవుచున్న కళాశాలను సంస్థాపించిన మహనీయులు. తాము సంపాదించిన విత్తము నెల్ల విద్యాభివృద్ధికి వినియోగించి కీర్తి వడసినవారలు. ఆంధ్ర రాష్ట్రోద్యమమునకు ప్రజల సానుభూతి నొసఁగు దత్తమండల వాస్తవ్యులలో నొకరు. పేద బాలుర పాలిటి పితరులు.

వైశ్యాంగనస్త్రీల లక్ష్మీనిలాంనసభ:— క్రింది వారుస లోని పేర్లు—1. సీ. పట్టమ్మాళ్; 2. వి. లక్షమ్మ; 3. వి. ముత్తులక్ష్మిఅమ్మాళ్; 4. టి. వి. శేషగిరి అయ్యరుగారి భార్య; 5. ఎం. లక్ష్మిఅమ్మాళ్, (ప్రెసిడెంటు); 6. మూసిగా వని మొదలియారుగారి భార్య; 7. వల్లా గొండయ్యపల్లి అమ్మ. రెండవ వరుసలో 1. కె. అనుమాబాయి, (జాయింటు సెక్రటరి); 2. వి. మంగ రాజమ్మ; 3. మీనాక్షి అమ్మాళ్; 4. కే. రంగమ్మాళ్; 5. ఎస్. అమ్మణిఅమ్మ; 6. జానకిఅమ్మాళ్; 7. అ. చిన్నమ్మ. పైవరుసలో 1. ఎస్. పార్వతి అమ్మాళ్; 2. కే నారాయణమ్మ; 3. వై. సుబ్బమ్మ; (జాయింటు సెక్రటరి) 4. డి. రంగారమ్మ; 5 సీ. చెల్లమ్మాళ్.

పిస్సా కమలాక్షమ్మ గారు:— ఈమె మండి వాస్తవ్యులు అన్నమురాజు నరసింహయ్య పంతులు గారి కొమార్తె. నెల్లూరు వకీలు వి. రాజగోపాలు గారి సతీమణి. పసితనమునుండియు స్త్రీసంఘ సంస్కరణమునందును స్త్రీవిద్యాభివృద్ధియందును మిగుల నుత్సాహము గలిగి మిక్కిలి పాటుపడియె. నెల్లూరునందు వారమున కొకసారి స్త్రీల నందఱి నొకచోట చేర్చి సద్విషయములను ప్రసంగించి కాలము పుచ్చుచుండుట కేర్పాటు చేయుటకై ఈమె చాల పాటుపడి కొంత కాలము అట్లు జరుపుచుండెను. స్త్రీలకుఁగాను ఏర్పాటుచేయఁబడిన పరీక్షలను కొన్నింటిని ఈమె దగ్గఱనుండి జరిపెను. ఈమె మిక్కిలి పసితనముననే అనఁగా 19-వ సంవత్సరముననే ఒక యాఁడుబిడ్డను గని కాలగతి నొందెను. నెల్లూరు మండలమున జరిగిన యాంధ్ర స్త్రీల సభలోని మొదటి తీర్మానము ఈమె వియోగమును గుఱించియే.

జాతీయవిశ్వవిద్యాలయములోని యాంధ్రవిద్యార్థులు:—గత సంవత్సరము జూలయి నెలలో అఖిలభారతీయజాతీయ విశ్వవిద్యాలయమునకు ప్రధానాంగముగ మదనపల్లియందు నెలకొల్పఁబడిన విశ్వవిద్యాలయ కళాశాలయందు ప్రకృతము దేశము లోని వివిధప్రాంతములనుండి వచ్చి సుమారు వందమంది విద్యార్థులు చదువుకొనుచున్నారు. అందు ఆంధ్రదేశమునుండి వచ్చిన యువకుల సంఖ్య ప్రోత్సాహకరముగా నున్నది. వారిలో అన్యోన్యప్రేమానురాగము లుండుటకై యొక సంఘము "ఆంధ్రభ్రాతృసమితి" యను నామమున నెలకొల్పఁబడినది. ఈ ఛాయాపటమున నున్నవారలు:— మొదటివరుస (నేలమీఁద కూర్చున్నవారలు):— హనుమంతప్ప

